

జ్ఞానలహరి.

THE

# JNANA-LAHARI.

EDITED AND PUBLISHED

BY

**SUSARLA GOPALASASTRY, B. A.,**

*First Grade Pleader,*

AMALAPURAM,

*GODAVARI DISTRICT.*

**AMALAPURAM:**

PRINTED BY PERI VENKATESAM,

PROPRIETOR,

AT THE SARVANI PRESS.

*1910.*

పునశ్చాదర్శనం గతః। నాసౌ తవ న తస్య త్వం వృథా కా

పరిదేవనా కో వా ప్రలాపః అదృష్టదృష్టప్రనష్టభ్రాంతిభూతేష్వేషు

This verse " అవ్యక్తాదీని..." is intended to show th
...rding bodies which are mere combinations of causes a...
...useless. For, the bodies of beings such as sons, fr...
which are mere conglomeration of causes and effects, ha...
origin, unmanifested and unseen, before birth; being bo...
have a manifested middle condition; prior to dissolution, they are of perceived end *i. e.*, after destruction they are o... seen existence (అవ్యక్తనిధనాని). Accordingly it is said.

"He has come from non-perception (the unseen) and ha... gone back to non-perception. He is not thine, nor thou his; wha... is this vain lamentation for". Mahabt. Streeparva. 2—13.

Regarding these bodies of sons and friends &c., which are ...e illusions first unseen, seen in the middle and again unseen in ...end, there is no room for lamentations.

——::o::——

తాత్పర్యము.

కార్యకారణసంఘాతరూపములగు శరీరములనుగురించి వ్యసనముబొందుట యుక్తముగాదు. కార్యకారణసంఘాతాత్మకములగు పుత్రమిత్రాదులశరీరము అవ్యక్తాదులు అనగా పుట్టుకకుమునుపు కనబడుటలేదు. ఏరూపముగానున్నవో తెలియుటలేదు. పుట్టినతరువాత ఆమరణాంతము కనబడుచున్న స్థితికలవి. అట్లువ్యవహారదశలో గనబడుచున్న శరీరములు చచ్చినవెనుక పుట్టక మునుపటివలెనే మరల గనబడకుండబోవుచున్నవి. ఈరీతిగా మహాభారతమందు చెప్పబడినది.

" అదర్శనాదాపతితః। పునశ్చాదర్శనంగతః।
నాసౌతవనతస్యత్వం వృథాకాపరిదేవనా ॥ "

మానవుడు కనబడనియవస్థనుండివచ్చి తిరిగి మునుపటివలెనే కనబడకుండబోవుచున్నాడు. వాడు నీవాడు కాడు, నీవు వానికి గావు. కావున వ్యసనముబొందుట వ్యర్థము. కాబట్టి మొదటగనబడనివియు, మధ్యకాలమందున్నట్లు క

యము, తనకు గనబడకపోవునట్టి స్వభావముగలవియును, స్థిరత్వమింతికలుగ పన్నవియును అగు పుత్రమిత్రాది దేహములనుగురించి పలవ్యర్థము గావ్యసనము జెందెదవు.

*Notes.*

ఆత్మనిత్యుడును, నిర్వికారుడును. అగుటచేత [ఆత్మనుగురించి వ్యసనమవసరములేకపోయినను కార్యకారణసంఘాతాత్మకములగు] భీష్మాదిశరీరములకు నాశనమువచ్చునని వ్యసనమును పొందుచున్నానని అర్జునుడు చెప్పనేమోయని యీశ్లోకముచేత శరీరములనుగురించి వ్యసనముయుక్తముగాదని చెప్పుచున్నది.

అవ్యక్తి :— అభావము or non-existence is two-fold-(1) ప్రాగభావము (2) ప్రధ్వంసాభావము. ప్రాగభావము is the non-existence of a thing before its birth as the thing; a pot before its birth *as a pot*, does not exist as a pot; its existence before its origination is unseen and unmanifest. It could not have come from nothing. Again the pot after its destruction, does not exist as pot. Its existence after destruction is unperceived (అవ్యక్తం). It could not have been annihilated. ప్రధ్వంసాభావము is the non-existence of a thing after destruction, as the thing.

అవ్యక్తం = unperceived. ఆది = origin; తత్ర = in the matter of destruction of bodies.

---

ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ
చాన్యః। ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి శ్రుత్వాప్యే
నం వేదనచైవకశ్చిత్ ॥ 29

టీక:

---

కశ్చిత్ = ఒకానొక మనుజుడు, ఏనం = ఈయాత్మను, ఆశ్చర్యవత్ ఎన్నడునుజూడనివస్తువును ఆకస్మికముగా జూచినట్లు ఆశ్చర్యముతో పశ్యతి = చూచుచున్నాడు. తథైవ = అలాగుననే, అన్యశ్చ = మరియొకపురుషుడు, ఏనం = ఈయాత్మను, ఆశ్చర్యవత్ = పూర్వమందెన్నడును చెప్పబడనిదియును,అద్భుతమైనదియును, అగువస్తువును గురించి అకస్మాత్తుగాచెప్పినట్లు ఆశ్చర్యముగా, వదతి చెప్పుచున్నాడు. అన్యః = మరియొకడు, ఏనం = ఈయాత్మను, ఆశ్చర్యవత్ =

పూర్వమెన్నఁడు విననిదియును అద్భుతమైనదియును, అగుదానివలె ఆశ్చర్యవ
త్తు శృణోతి = వినుచున్నాఁడు, శ్రుత్వాపి = వినియును చూచియును పలికి
ఏనం = ఈయాత్మను, కశ్చిత్ = వాఁడొకఁడు. వేదనచైవ = ఎఱుఁగుటయే

As a marvel one sees Him; so also as a marvel, anot speaks of Him; as a marvel another hears of him; Yet havi heard Him, none understands Him at all

---:0:---

## Com. భాష్యం

దుర్విజ్ఞేయోఽయం ప్రకృత ఆత్మా కిం త్వామేవైకం ఉపాలభే సాధా-
రణే భ్రాంతినిమిత్తే కథం దుర్విజ్ఞేయోఽయమాత్మేత్యత ఆహ ఆశ్చర్యవదితి ఆ-
శ్చర్యవత్ ఆశ్చర్యం అదృష్టపూర్వమద్భుతమకస్మాద్దృశ్యమానం తేన తుల్యం
ఆశ్చర్యవత్ ఆశ్చర్యమివైనమాత్మానం పశ్యతి కశ్చిత్ ఆశ్చర్యవదేనం వద-
తి తథైవ చాన్యః ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి శ్రుత్వా దృష్ట్వోక్త్వాప్యాత్మానం
వేదనచైవకశ్చిత్ అథవా యోఽయం ఆత్మానం పశ్యతి సఆశ్చర్యతుల్యో యో
వదతి యశ్చ శృణోతి సోఽనేకసహస్రేషు కశ్చిదేవ భవత్యతో దుర్బోధ ఆత్మే-
త్యభిప్రాయః.

The *self* which is the subject of the present discussion. is the most difficult thing to understand. Why should I blame you alone. seeing that the cause of illusion exists in all? The Lord says how the *self* is difficult to understand. One sees the self as a thing of wonder, a thing unseen before, marvellous and seen unexpectedly. Similarly also, another speaks of him as a marvel; another hears of him as a marvel. Having heard, seen, and spoken of, him, none *realises* him. Another interpretation (అథవా). He who *sees* the *self* is a thing of wonder; he who speaks of him, hears of him, is only one among hundreds of thousands. So the meaning is that the *self* is very difficult to understand.

---:0:---

తాత్పర్యము.

ఓ యర్జునా! మనము ఇప్పుడు విచారించుచున్న ఆత్మ సులభముగా దెలియశక్యము కానివాడగుటచేత ఆత్మజ్ఞానములేక భీష్మాదులనుగురించి దుఃఖించుచున్నావని నిన్నుమాత్రమే నిందించుటలేదు. నీకుకలిగినభ్రాంతి సర్వసాధారణముగానందరి యందును గనుపడుచున్నది. ఉపాధిరహితుడగు కేవలాత్మ ఎకాలమును ఎలనను దుర్జ్ఞేయుడనో చెప్పబడుచున్నది. ఒకానొకడు పూర్వమందెవ్వడును చూడబడనిది యును, అద్భుతమయినదియును, అకస్మాత్తుగా చూడబడినదియును అగునాశ్చర్య వస్తువునుజూచినట్లు ఆత్మను చూచుచున్నాడు. మరియొకడు అరీతిగానే ఆత్మను గురించి చెప్పుచున్నాడు. మరియొకడు ఆశ్చర్యముగా వినుచున్నాడు. ఈరీతిగా చూచినను, చెప్పినను, విన్నను, ఒకడును ఆత్మను దెలిసికొనలేకపోవుచున్నాడు. మరియొకఅర్థమేమనగా లోకములో ఆత్మదర్శనము అరుదుగానుండుటచేత ఆ త్మను జూచువాడు అరుదుగానున్నాడు. కావున ఎవడు ఆత్మను జూచునో వాడు ఆశ్చర్యతుల్యుడు. ఆత్మదర్శనము దుర్లభముగనుక ఆత్మను వివరించుట దుర్ల భము. గనుక ఆత్మ యిట్టివాడని చెప్పువాడును అనేకసహస్రమనుజులలో నొకడు గలుగుచుండును. గనుక ఆత్మజ్ఞానము దుర్లభము.

*Notes.*

దుర్జ్ఞేయుడు :— 'నేను' అనుతలంపునకు విషయుడగువాడు అందరిచేతను తెలియబడు చున్నాడు. అయితే 'నేను' అనుతలంపునకు విషయుడు ఉపాధివశుడు. ఉపాధిరహితుడగు కేవలాత్మ దుర్జ్ఞేయుడని యీశ్లోకము చెప్పుచున్నది.

ఆశ్చ వా :— This verse admits of two interpretations; in the first interpretation, the word ఆశ్చర్యవత్ goes with the verbs పశ్యతి, వదతి, శృణోతి, meaning thereby that one sees speaks, and hears of him as a wonder; in the second interpretation the word ఆశ్చర్యవత్ goes with కశ్చన; as the seeing, the speaking and the hearing of god is very rare in the world, he who sees..., is a rarity and wonder.

శ్రుత్వా :— This word includes దృష్ట్వా, ఉక్త్వాఅపి; this word is used to show that it is most difficult to *realise* the *self* even for one who sees...

దేహీ నిత్యమవధ్యోయం దేహే సర్వస్య భారత।
తస్మాత్ సర్వాణి భూతాని నత్వం శోచితుమర్హసి॥

టీక.

హేభారత = ఓయర్జునుఁడా, సర్వస్య = సమస్తమైన మనుష్యదేవతాది ప్రాణిసంఘాతముయొక్క, దేహే = శరీరము హతమైనను (వధ్యమానేపి), అయం దేహీ = యీదేహమునందుండుఆత్మ, నిత్యం = ఎల్లప్పుడును, అవధ్యః = సంహరింపబడతగినవాఁడుకాఁడు. తస్మాత్ = ఆత్మయొక్క అనశ్వరత్వకారణమువలన, త్వం = నీవు, సర్వాణిభూతాని = సమస్తమైన భీష్మాదిశరీరములనుగూర్చి, శోచితుం = దుఃఖించుటకొఱకు, నార్హసి = తగవు.

The resident in the body of every one is ever indestructible, O Bharata; therefore you ought not to grieve for any creature.

———::o::———

**Com.** భాష్యం.

అథేదానీం ప్రకరణార్థముపసంహరన్ బ్రూతే దేహీతి—సర్వస్య ప్రాణిజాతస్య దేహే వధ్యమానేపి అయం దేహీ నవధ్యః యస్మాత్తస్మాత్ భీష్మాదీని సర్వాణి భూతాన్యుద్దిశ్య నత్వం శోచితుమర్హసి.

The Lord closes the subject of this section in the words of దేహీనిత్య...

Although the body of the whole lot of creatures is killed, the *self*, the dweller of the body, is not destroyed; so you ought not to grieve for any creature, such as Bhishma and others.

———::o::———

తాత్పర్యము.

ప్రకరణవిషయమును భగవంతుఁడు దేహీనిత్యమవధ్యోయమను శ్లోకముచేత ముగించుచున్నాఁడు. సమస్తమయిన ప్రాణిసముదాయముయొక్క దేహము నశించినను దేహియగు నాత్మ అవధ్యుఁడగుటచేత భీష్మాది సర్వభూతములను గుఱించి దుఃఖించుటకు నీవుతగవు.

*Notes.*

It has already been stated that the word Bhishma indicates the body of Bhishma and the Jivathma resident in it. It has already been shown that Arjuna should not grieve for Bhishma denoting body, in the verse అవ్యక్తాదీనిభూతాని (అ. 2, శ్లో. 28). The Lord concludes, in the present verse, by saying that Arjuna ought not to grieve for Bishma and others, representing the Jivathma inside.

సర్వస్యదేహే = the body of all creatures *i. e.*, the body of every creature, men, deva &c.

---

స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥ **31**

టీక.

అపిచ = ఇంతియుకాక, స్వధర్మం = తనయొక్కధర్మమును అనగా క్షత్రియధర్మమును, అవేక్ష్య = ఆలోచించి, వికంపితుం = చలించుటకొరకు, నార్హసి = తగవు. హి = అదియుక్తమేకదా, క్షత్రియస్య = క్షత్రియునకు, ధర్మ్యాత్ = ధర్మసమ్మతమగు, యుద్ధాత్ = యుద్ధముకంటె, అన్యత్ = ఇతరమైన, శ్రేయః శ్రేయస్కరమగునది, నవిద్యతే = లేదు.

Moreover, you ought not to shake, regard being had to thine own duty; For, there is no greater virtue in a Kshattriya, than a righteous battle enjoined on him by the code of morality (ధర్మ్యాత్).

———:o:———

**Com.** భాష్యం.

ఇహపరమార్థతత్త్వాపేక్షాయాం శోకోవా మోహోవా నసంభవతీత్యుక్తం నకేవలం పరమార్థతత్త్వాపేక్షాయామేవ కింతు స్వధర్మమితి. స్వధర్మమపి స్వోధర్మః స్వధర్మః క్షత్రియస్య ధర్మః యుద్ధం తమప్యవేక్ష్య త్వం నకంపితుం ప్రచలితుం అర్హసి క్షత్రియస్య స్వాభావికాత్ ధర్మాత్మస్వాభావ్యాదిత్యభిప్రాయః తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థంచేతి ధర్మా

నపేతం పరం ధర్మ్యం; తస్మాత్ ధర్మాత్ యుద్ధాత్ శ్రేయో౽న్యః క్షత్రియస్య
నవిద్యతే హి యస్మాత్.

(ఇహ) In the verse దేహీనిత్యమవధ్యోయం, it has been stated there is no occassjon for grief and attachment, when viewed in the light of absolute truth. It is not only by reason of the higher truth, but also by virtue of 'thine own duty' (that Arjuna need not grieve for). Seeing that battle is the duty of Kshatriya, you ought not to shake from that duty which is natural to Kshatriya *i. e.*, duty which is natural to you as a kshatriya; this fighting is the highest virtue and is not unconformable to the code of duty (ధర్మ్యం), as it secures merit, and works for the welfare of the people, throught the conquest of countries. There exists no greater merit in a kshatriya than a rightes war; హి means wherefore.

——::o::——

తాత్పర్యము.

---

'దేహీనిత్యమవధ్యోయం' అను శ్లోకములో యథార్థముగా నాలోచించినపుడు ఆత్మ చంపబడనిదగుటవలన శోకమోహములకవసరములేదని చెప్పబడినది. ఇంతియకాదు. యుద్ధము క్షత్రియునకు సహజధర్మమగుటవలనగూడ యుద్ధముచేయవలసివచ్చెనేయని వ్యసనమునుబొందుట యుచితముగాదని యీశ్లోకము చెప్పుచున్నది. మరియును యుద్ధము క్షత్రియునకు స్వధర్మమగుటవలన నీవు క్షత్రియుడవై క్షత్రియధర్మావలంబుడవైయున్నందున అట్టిస్వాభావికమగు యుద్ధధర్మమునుంచి చలించుట యుచితముగాదు. మరియును యుద్ధము అనేకసుగుణములుకలిగియున్నది. యుద్ధమువలన జయముకలుగును. తద్వారా రాజ్యలాభమును ధనలాభమును గలుగును. వీటివలన యాగాదికర్మలనెరవేర్పబడి మోక్షసాధకములగును. గనుక మోక్షధర్మసాధనము యుద్ధము. అన్యాయాక్రాంతమగు దేశములను యుద్ధమువలన న్యాయముగాజయించి రాజ్యపరిపాలనమును జేయవచ్చును. మరియును యుద్ధము ధర్మశాస్త్రచోదితధర్మము. గనుక మోక్షాద్యనేకసుగుణసంపదగలిగిన యుద్ధముకంటె మరియొకటి క్షత్రియునకు శ్రేయస్కరమగునది లేదు.

*Notes.*

అస్థానమున వ్యసనము బొందుట యుచితము గాదు. ఏలయనగా 1. ఆత్మ నిత్యుడు; 2. శరీరము స్వాభావికముగా నశ్వరము; 3. యుద్ధము క్షత్రియధర్మము, శాస్త్రవిహితధర్మము, ముక్త్యాది ధర్మసాధనము, ప్రజాపాలనకారణము. యుద్ధముచేయవలసివచ్చెనని వ్యసనము బొందుట యుక్తము గాదు. పైకారణములవలన యుద్ధము శూరుడు జేయవలయును.

వికంపితుం—this may mean waver; this has reference to the words said by Arjuna "వేపథుశ్చ శరీరే మే...' the reply is given by the Lord here.

శ్రేయోఽన్యత్:— This has reference to the words said by Arjuna న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే. This is shown to be false by the Lord by showing that war is the supreme duty of Arjuna.

The reply is given by the Lord here.

---

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం॥ 32

టీక.

---

హే పార్థ = ఓ యర్జునుడా, యే = ఏ రాజులు, యదృచ్ఛయా = అప్రార్థన చేత, ఉపపన్నం = సంప్రాప్తమయినదియును, అపావృతం = తెరవబడిన, స్వర్గ ద్వారమ్ = స్వర్గమునకు ద్వారభూతమయినదియును, ఈదృశం = ఇట్టి, యుద్ధమ్ యుద్ధమును, లభంతే = పొందుచున్నారో, తే క్షత్రియాః = అట్టి రాజులు, సుఖినః = సుఖవంతులు (అగుచున్నారు).

Happy are the kshatriyas, O Pardha, who obtain such a fight which comes unsolicited and which is an open door to heaven.

—::o::—

**Com.** భాష్యం.

—o:—

కుతశ్చ తద్యుద్ధం కర్తవ్యం ఇత్యుచ్యతే యదృచ్ఛయేతి. యదృచ్ఛయా చా ప్రార్థితమాగతముపపన్నం స్వర్గద్వారమపావృతం ఉద్ఘాటితం య ఏతదీదృశం యుద్ధం లభంతే క్షత్రియాః హే పార్థ! కిన్న సుఖినస్తె

It is said in this verse యదృ... why the battle should be fought.

O Pardha, are not those kshatriyas happy indeed, who obtain such a battle which comes unsought and which is an open door to heaven.

——::o::——

### తాత్పర్యము.

యుద్ధము హింసాకరమగుటచేత యుద్ధముచేయుట యుచితముగాదని అర్జునుడు చెప్పనేమోయని తలంచి శ్రీకృష్ణుడు అగ్నిష్టోమాదిక్రతువులయందలి పశువధవలె వేదచోదితమగు ధర్మము హింసాకరమైనను హింసకాదనియును రాజులకు యుద్ధము జేయుట దోషములేదనియును చెప్పుచున్నాడు. అయాచితముగా సంప్రాప్తమయిన యుద్ధమునందు జయించినవారలకు భూలోకరాజ్యము గలుగును. దానివలన న్యాయముగా రాజ్యపరిపాలనము జేయుటవలన ఇహలోకసుఖమును తరువాత స్వర్గలోకసుఖమును గలుగును. యుద్ధమందు మరణమును బొందిన వారలకు స్వర్గలోకసుఖము కలుగును. గనుక యుద్ధము స్వర్గద్వారము.

*Notes.*

This verse is the reply to the words of Arjuna 'స్వజనంహికథంహత్వాసుఖినస్యామమాధవ'. By a righteous war, the pleasures of this and the next world are obtained. It cannot be said that a warrior who kills and is killed in battle dies in vain.

---

అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33

టీక.

---

అథ = లేక, ధర్మ్యం = ధర్మసమ్మతమయిన, ఇమం సంగ్రామం = ఈయుద్ధను, త్వం = నీవు, నకరిష్యసిచేత్ = చేయవేని, తతః = అందువలన, స్వధర్మం = క్షత్రియునకుదగినధర్మమును, కీర్తించ = యశస్సును, హత్వా = విడిచి, పాపం = పాపమును, అవాప్స్యసి = పొందగలవు.

But if you will not fight this battle which is consistent with law and enjoined on you as a duty (ధర్మ్యం), you will, by so doing, (తతః) incur sin, having thrown away your duty and fame.

—:o:—

**Com.** భాష్యం.

—:o:—

ఏవం కర్తవ్యతా ప్రాప్తమపి అథేతి। అథత్వమిమంధర్మ్యం ధర్మాదనపేతం విహితం సంగ్రామం యుద్ధం నకరిష్యసిచేత్ తతః తదకరణాత్ స్వధర్మం కీర్తిం చమహాదేవాదిసమాగమనిమిత్తాం హిత్వా కేవలం పాపమవాప్స్యసి.

Even on finding it your duty to fight—the Lord says in the verse అథచే... If you will not carry on this warfare which is conformable to law and enjoined on you as a duty, then by refusing to fight the battle (తతః), you will incur sin only, having cast away your duty and fame achieved in your encounter with such great persons as the Mahadeva &c.

—:o:—

తాత్పర్యము.

యుద్ధము అనేకసుగుణసంపదగలదయినను, శ్రేయస్కర మయినదయినను విధిచోదితముయినదయినను, నేనేవిధమయిన సుఖమునుగాని, రాజ్యమునుగాని విజయమునుగాని కోరనుయని చెప్పియుండుటచేత అర్జునుడు యుద్ధముజేయనని చెప్పునేమోయనితలంచి వేదశాస్త్రచోదితమగు యుద్ధకర్మజేయనియెడల పాపము తటస్థించునని శ్రీకృష్ణుడీశ్లోకమును చెప్పుచున్నాడు. యుద్ధము క్షత్రియధర్మమనియును వేదశాస్త్రములచేత జెప్పబడుటవలన జేయదగినదనియును ఎరిగియుండి జేయనియెడల కిరాతరూపమునెత్తిన మహాదేవునితో పోరాడుటయు గంధర్వాదులతో యుద్ధముచేయుటయు మొదలుగాగల గొప్పపనులవలన సంపాదింపబడినయశస్సును పోగొట్టుకొనుటయు స్వధర్మత్యాగముచేయుటయును గాక పాపమునుబొందుదువు.

*Notes.*

In the previous verse it has been shown that the result of performing one's own duty is the acquisition of the fruits

Swarga &c. In this verse the consequences of the violation of that duty are shown:

స్వధర్మస్య యుద్ధస్యాకరణే స్వర్గాదిఫలప్రాప్తిం ప్రదర్శ్య తదకరణే ప్రత్యవాయప్రాప్తిం ప్రదర్శయతి.

This verse is the reply to the words of Arjuna.

న కాంక్షే విజయం కృష్ణ (అ 1, శ్లో 30), అపి త్రైలోక్యరాజ్యస్య (అ 1, శ్లో 35).

మహాదేవాది :— The story of the contact of Arjuna with Siva occurs in the Vana Parva of Mahabharata.

The Pandava princes being deceitfully defeated at the game of dice by wicked Duryodhana and his friends, went to live in the woods; while they were living in the forest, Arjuna of mighty arms, went, at the command of Yudhishtra, to the mountain of the Himavat, to obtain a sight of Sankara, the god of gods; there he devoted himself to ascetic penances to propitiate the god, Siva; there Arjuna had an encounter with Siva who appeared to him in the guise of Kirata, a mountaineer; Siva pleased with the courage, prowess and patience, showed by Arjuna, granted him the irresistible weapon పాశుపతాస్త్రం.

Another instance of Arjuna's encounter with great persons is with the king of Gandharvas; while Pandus were living in the forest of Dwita, subject to great distress and privations, Duryodhana and his friends went with their ladies and large troops, to Dwita forest, to show themselves in their royal pomp and pleasures. Duryodhana encamped his troops near the lake of Dwitavana which belonged to Gandharva king. There in the encounter between the army of Duryodhana and Gandharvas, Karna was disgracefuly routed and Duryodhana was taken a prisoner by the Gandharva king. Thereupon Arjuna, the foremost of bowmen defeated Chitrasena, the Gandharva king and rescued Duryodhana.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥ 34

టీక.

అపిచ = ఇంతియేకాదు, భూతాని = దేవమనుష్యాదులు, అవ్యయాం = శాశ్వతమైన, తేఅపకీర్తిం = నీయొక్క అపకీర్తిని, కథయిష్యంతి = చెప్పగలరు. సంభావితస్య = శౌర్యాదిగుణములచేత గౌరవనీయునివిషయములో, అపకీర్తిః = అపకీర్తి, మరణాత్ = చావుకంటెను, అతిరిచ్యతే = అధికదుఃఖకరమగుచున్నది.

Moreover (అపిచ), men will recount thy perpetual infamy; in the case of one who has been esteemed for valour &c., infamy is worse than death.

---::o::---

## Com. భాష్యం.

---:o:---

నకేవలం స్వధర్మకీర్తిపరిత్యాగః అకీర్తిమితి- అకీర్తించాపి తే తవ భూతాని అవ్యయాం దీర్ఘకాలాం కథయిష్యంతి। ధర్మాత్మశూరఇత్యేవమాదిభిర్గుణైః సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే సంభావితస్య చాకీర్తేః మరణం వరమిత్యర్థః.

It is not merely the failure of duty and the loss of fame, but infamy...

Men will recount thy infamy that lasts for a long time. To one who is highly spoken of as a man of righteousness and heroism & death is better than infamy.

---::o::---

## తాత్పర్యము.

ఓయర్జునుడా నీవు యుద్ధమునుచేయకపోతివేని కేవలము స్వధర్మపరిత్యాగము కీర్తినాశనము కలుగుటయేగాక మనుష్యాదులు నీయొక్క అపకీర్తిని చిరకాలముచెప్పగలరు. ధర్మాత్ముడు స్వధర్మాచరణుడనియును, శూరుడనియును, మరియు ననేకసుగుణములుగలవాడనియును, గౌరవింపబడినవానికి మరణముకంటె అపకీర్తియే అధికదుఃఖకరము. మరియును యుద్ధమునుజేసినయెడల మరణముగలుగవచ్చునని శరీరసంరక్షణచేసికొనుటయుచితమనితలంచి యుద్ధమునుజేయనియెడల మరణముకంటె అపకీర్తియే అధికదుఃఖకరమని చెప్పి యుద్ధముచేయుట యుత్తమకార్యమని భగవంతుడు చెప్పుచున్నాడు.

*Notes.*

అవ్యయాం = everlasting.

మరణాదతిరిచ్యతే:—మరణము స్వల్పకాలముమాత్రము దుఃఖమును కలుగజేయును. అపకీర్తి చిరకాలదుఃఖమును కలుగజేయును. గనుక మరణముకంటె అపకీర్తియే మిగులదుఃఖకారి.

---

భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః।
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥ 35

టీక.

---

యేషాం = ఏబాహ్లీకభగదత్తాదులకు, త్వం = నీవు, బహుమతః = శౌర్యశౌర్యాదిగుణములచేతను బహుమానితుడవైతివో, మహారథాః = ఆమహారథికులైన బాహ్లీకదుర్యోధనాదులు, త్వాం = నిన్ను, భయాత్ = భయమువలన, రణాత్ = యుద్ధమునుండి, ఉపరతం = మరలినవానినిగా, మంస్యంతే = ఆలోచింతురు, బహుమతః = ఇంతవరకును బహుమానముచేయబడినవాడవు, భూత్వా చ= అయ్యును, లాఘవం= ఇప్పుడుచులకదనమును, యాస్యసి = పొందగలవు.

The warriors of great eminence, who have held thee in great esteem (for unparalled prowess &c,), will think that thou hast turned away from the battle through fear (of great men in the enemy's ranks). Having been hither the object of their high esteem, thou wilt be hereafter the object of their contempt.

——::0::——

**Com.** భాష్యం.

——:0:——

భయాదితి భయాత్ కర్ణాదిభ్యో రణాత్ యుద్ధాత్ ఉపరతం నివృత్తం మంస్యంతే చింతయిష్యంతి న కృపయేతి త్వాం మహారథాః దుర్యోధనప్రభృతయః కే మంస్యంతే ఇత్యాహ యేషాంచ త్వం దుర్యోధనాదీనాం బహుమతో బహుభిర్గుణైర్యుక్త ఇత్యేవం బహుమతో భూత్వా పునస్త్వం యాస్యసి లాఘవం లఘుభావం.

ఓమ్

బ్రహ్మణేనమః

# ఈశావాస్యోపనిషత్.

# THE ISAVASYOPANISHD.

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

శాంతిః శాంతిః శాంతిః.

హరిః ఓమ్

ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్॥

టీక.

ఇదగ్ంసర్వం = ఈసమస్తమున్ను, (అనగా) జగత్యాం = బ్రహ్మాండకటాహభూమియందు, యత్కించ = ఏదైనను, జగత్ = స్థావరజంగమాత్మకమో, (అదంతయును), ఈశా = ఈశ్వరునిచేతను, వాస్యం = సర్వోపాధులయందును ప్రత్యగాత్మగా వ్యాప్తమయినది, తేనత్యక్తేన = ఈసమస్తచరాచరమంను ఆత్మభావనచేగలుగు త్యాగబుద్ధిచేత, భుఞ్జీథా = పరిపాలించుమా, కస్యస్విత్ = ఎవనియొక్కయున్ను, ధనం = ధనమును, (ఈప్రకారముగాత్యజించబడిన ఈషణత్రయముగలవాడవై), మాగృధా = కోరకుమా.

All this *i. e.*, whatsoever moveable and immoveable, exists in the universe, is covered by the Isvara. Enjoy with this notion of renunciation. Desire not any body's, wealth.

———::o::———

**Com.** భాష్యం.

ఈశా ఈష్టె ఇతీట్ తేన ఈశా; ఈశితా పరమేశ్వరః పరమాత్మా సర్వ
స్య। సహి సర్వమీష్టె సర్వజంతూనామాత్మాసన్ ప్రత్యగాత్మతయా తేన స్వేన
స్వరూపేణాత్మనా ఈశా వాస్యం ఆచ్ఛాదనీయం. కిమ్—ఇదం సర్వం యత్కించ
యత్కించిత్ జగత్యాం పృథివ్యాం జగత్ తత్సర్వం స్వేనాత్మనా ఈశేన ప్ర
త్యగాత్మతయా అహమేవేదం సర్వమితి పరమార్థసత్యరూపేణ అనృతమిదం స
ర్వం చరాచరమాచ్ఛాదనీయం స్వేన పరమాత్మనా। యథా చందనాగర్వాదే
రుదకాదిసంబంధజక్లేదాది జమౌపాధికం దౌర్గంధ్యం తత్స్వరూపనిఘర్షణేనాచ్ఛా
ద్యతే స్వేన పారమార్థికేన గంధేన తద్వదేవ హి స్వాత్మన్యధ్యస్తం స్వాభావికం
కర్తృత్వభోక్తృత్వాదిలక్షణం జగద్ద్వైతరూపం జగత్యాం పృథివ్యాం జగత్యా
మిత్యుపలక్షణార్థత్వాత్ సర్వమేవ నామరూపకర్మాఖ్యం వికారజాతం పరమా
ర్థసత్యాత్మభావనయా త్యక్తం స్యాత్। ఏవమీశ్వరాత్మభావనయా యుక్తస్య పు
త్రాద్యేషణాత్రయసంన్యాసఏవాధికారో నకర్మసు। తేన త్యక్తేన త్యాగేనేత్య
ర్థః। నహి త్యక్తో మృతః పుత్రోవా భృత్యోవాఽఽత్మసంబంధితయా అభావాదా
త్మానం పాలయత్యతః త్యాగేనేత్యయమేవ వేదార్థః। భుఞ్జీథాః పాలయేథాః।
ఏవం త్యక్తైషణస్త్వం మాగృధః గృధిం అభిలాషం మాకార్షీః ధనవిషయాం; క
స్యస్విత్ ధనం కస్యచిత్ పరస్య స్వస్యవా ధనం మాకాఙ్క్షీరిత్యర్థః। స్విది
త్యనర్థకో నిపాతః। అథవా మాగృధః కిస్మాత్ కస్యస్విద్ధనమిత్యాక్షేపార్థో నక
స్యచిద్ధనమస్తి యద్గృధ్యేత। ఆత్మైవేదం సర్వమితి ఈశ్వరభావనయా సర్వం
త్యక్తం అత ఆత్మన ఏవేదం సర్వమాత్మైవచ సర్వమతో మిథ్యావిషయాం గృ
ధిమాకార్షీరిత్యర్థః।

The word ఈశా comes from the verb ఈశ to rule, which becomes ఈష్టె whose instrumental form is ఈశా meaning-by the Lord.

...శా, the Lord, is the Paramesvara, the Paramathma of all. He rules all things, being the ప్రత్యగాత్మ, the individual *self*, in them. *All this* is covered by the Lord, by his own form, the Atma. *what?* All this—whatsoever, moveable and immoveable, exists in the wo[rld]. All this universe, moveable and immoveable, which is false in reference to the Highest Truth, should be covered by the *self*, the Paramathma, with the notion "I am all this as the inner self (ప్రత్యగాత్మతయా). Just as, in sandal, the bad odour which results from the presence of moisture caused by the contact with water, is lost in sandal's naturally good smell produced in the act of rubbing, similarly on the earth which is here used to represent the whole universe, all this—which is characterised by the differences of doer, enjoyer &c, which is superposed on the *self*, which has its existence in ignorance, which presents apparent duality, which exists with the differentiations of name, form and karma and which is of the bundle of modifications, becomes abandoned (as the effect of ignorance) with the reflection on the Paramathma as the *self*. He who thus meditates on the Isvara as the *self*, becomes qualified for the renunciation of three-fold desires of son &c., and not for karma. తేనత్యక్తేన means by such renunciation; We see in the world that one's son or servant who is given up or dead, does not protect that one by reason of the absence of any connection with him. Therefore the meaning of the word త్యక్తేన is renunciation. భుంజీథాః means protect (save). Having thus abandoned the three-fold desires (త్యక్తైషణం), do not entertain any desire for wealth. మాగృధః కస్యస్విద్ధనం means do not cherish desire for wealth either of yours or others. The word స్విత్ is a meaningless particle. Or it may be construed as 'do not long for. For what reason? (కస్యస్విత్). (The expression) whose is wealth' is used in the sense of contempt (ఆక్షేపార్థః). For, to nobody belongs any wealth which could be longed for. The meaning is all this becomes abandoned with the thought that all this is the *self* in the form of Isvara; therefore all this is of Atma and Atma is all this. Do not therefore cherish desires for things which are false.

———:0:———

## తాత్పర్యము.

ఈశాయనుపదము ఈశ ధాతువులోనుంచి పుట్టినకృదంతరూపమగు ఈట్ అనుదానియొక్క తృతీయాంతపదము. ఈశ్వరుడు పరమాత్మ. ప్రత్యగాత్మగా సర్వవస్తువులకును ప్రభువు. చరాచరలక్షణములుగలిగినట్టియు, ద్వైతరూపముగా గనుబడునట్టియు, ఆపరమాత్మయందు అధ్యస్తమయినట్టియు, కర్తృభోక్తృత్వాది లక్షణములుగలిగినట్టియు, నామరూపకర్మవికారరూపమయినట్టియు, యథార్థము చేత నసత్యమయినట్టియు, బ్రహ్మాండకటాహభూమియంతయు నీశ్వరునిచేత ఆచ్ఛాదింపబడినది. సుగంధచందనముచేతను తడివలనగలుగు దుర్గంధము కప్పబడిన రీతిని నామరూపాత్మకమగు విశ్వము ఆత్మచేతను కప్పబడినది. జగత్తంతయును ప్రత్యగాత్మగా ఈశ్వరుడనుభావనచేత నామరూపవికారమగు సర్వమున్ను విడువబడుచున్నది. ఇట్టిత్యాగబుద్ధితో ఆత్మను అజ్ఞానమునుంచి పరిపాలించుకొనుము. లోకములో నొకనియొక్క పుత్రుడుగాని సేవకుడుగాని విసర్జింపబడిన లేక మృతుడైనయెడల వారికతనితో సంబంధములేనందున నతనిని పాలించరు. ఇది యే త్యాగము. ఇట్టిత్యాగసంకల్పములతో త్యజింపబడిన ఈషణత్రయముగలవాడవై నీయొక్కగాని పరులయొక్కగాని ధనమునుకోరకుము. 'కస్యస్విద్ధనం' అను దానికి అర్థాంతరముకలదు. మాగృధః= కోరకుము, ఏలయనగా ధనమెవ్వరిది. ఎవరిదియునుగాదు. ఈశ్వరార్పణబుధ్యా ఇదంతయును ఆత్మస్వరూపమని త్యజింపబడుచున్నది. గనుక నిదంతయును ఆత్మసంబంధమైనది. ఆత్మ ఇదంతయును గనుక మిథ్యయగు నీధనమును కోరకుము.

---

*Notes.*

The Isavasyopanishad belongs to వాజసనేయసంహిత. The 18 mantras of the Upnanishad are devoted to Brahma of pure bliss, not to karma. It teaches the true nature and unity of Brahman.

ఈశావాస్యదశోమంత్రాః నకర్మప్రతిపాదకాః।

అఖండైకరసైశుద్ధబ్రహ్మణ్యేవసమన్వితాః॥

ఈశా :— ఈశఐశ్వర్యే, the కృదంత form of this verb is ఈట్; The instrumental form of ఈట్ is ఈశా=ఆనందాత్మనా.

వాస్యం :— This word comes from the root వస meaning to cover; వస ఆచ్ఛాదనే; The sense is “ తత్త్వతః ఈశ్వరాత్మకమేవ సర్వం భ్రాంత్యా యదనీశ్వరరూపేణగృహీతం తత్సర్వం ఏవాత్మైవేతి జ్ఞానేన ఆచ్ఛాదనీయం’ All this is, in absolute truth, of the form of Isvara; if by ignorance, it is believed otherwise, the Upanishad says, one should understand that the universe is covered with Isvara-self.

ప్రత్యగాత్మ = The inner individual self.

పరమార్థసత్యరూప = In view of the highest truth. The universe as a distinct entity is unreal.

క్లేద = moisture.

ఔపాధికం = due to ఉపాధి *i. e.*, caused by contact with things.

స్వాభావిక :— స్వభావః = అనాదిరవిద్యా ignorance; తత్కార్యం స్వాభావికం its effect is called స్వాభావికం.

ఇదం సర్వం :—What this సర్వం is, is explained as యత్కించ జగత్యాం జగత్.

జగత్యాం:— The word జగత్యాం is used by way of illustration, for the whole universe characterised by name, form, and karma బ్రహ్మాండకటాహాభూమౌ.

భుంజీథాః = “ రక్షణీయః స్వయంచాత్మ సంసారాదజ్ఞకల్పితాత్ ” save from Samsara which results from ignorance.

గృధం = ధనాభిలాషాం ‘ Money is the huge evil’. It is the root of all evils ‘ సర్వక్లేశబీజంహిరణ్యాదికం ’. Wealth is nobody's as all this is Atma “ ఆత్మైవేదంజగత్సర్వంధనం నైవాస్తికస్యచిత్ ”.

త్యాగేన :— The use of the word త్యాగ indicates సన్యాసః “ త్యాగశబ్దేన చాప్యత్ర సంన్యాసః పరికీర్తితః ”.

The first part of the Mantra instructs in the true state of things. The second part says that he who views the universe as the form of Isvara (బ్రహ్మాత్మకం సర్వం) is entitled to సన్యాసం or renunciation “ ఈశ్వరాత్మ...సన్యాసస్యైవాధికారో ”. the last part declares the duty of the sanyasin.

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥

టీక.

---

ఇహ = ఇక్కడ, కర్మాణి = అగ్నిహోత్రాదికర్మలను, కుర్వన్నేవ = చేయుచునే, శతసమాః = నూరుసంవత్సరములు, జిజీవిషేత్ = జీవించుటకు కోరవలెను. ఏవం = ఈరీతిగా, నరే త్వయి = నరుడవగునీవిషయమై, ఇతః = అగ్నిహోత్రాదికర్మలనాచరించుటకంటె, అన్యథా = మరియొకరీతి, నాస్తి = లేదు, కర్మ = అగ్నిహోత్రాదికర్మ, నలిప్యతే = ఏవిధముగాచేసినయెడల నిన్ను కర్మబద్ధుడనుగా చేయదో, (ఆవిధముగా కర్మలను చేయుము).

Only doing karma, one should wish to live (జిజీవిషేత్) a hundred years. While you, a man, thus act (wish to live) there is no other way than this, by which you are not bound by karma.

---:o:---

## Com. భాష్యం.

---:o:---

ఏవం ఆత్మవిదః పుత్రాద్యేషణాత్రయసంన్యాసేన ఆత్మజ్ఞాననిష్ఠతయాఽఽత్మా రక్షితవ్య ఇత్యేష వేదార్థః। అథేతరస్యానాత్మజ్ఞతయా ఆత్మగ్రహణాయాశక్తస్య ఇదముపదిశతి మంత్రః కుర్వన్నేవేతి। కుర్వన్నేవేహ నిర్వర్తయన్నేవ కర్మాణి అగ్నిహోత్రాదీని జిజీవిషేత్ జీవితుమిచ్ఛేత్ శతం శతసంఖ్యాకాః సమాః సంవత్సరాన్ తావద్ధి పురుషస్య పరమాయుర్నిరూపితమ్। తథాచ ప్రాప్తానువాదేన యజ్జిజీవిషేత్ శతం వర్షాణి తత్కుర్వన్నేవ కర్మాణీత్యేతద్విధీయతే। ఏవమేవం ప్రకారేణ త్వయి జిజీవిషతి నరే నరమాత్రాభిమానినీతి ఏతస్మాదగ్నిహోత్రాదీని కర్మాణి కుర్వతో వర్తమానాత్ ప్రకారాత్ అన్యథా ప్రకారాంతరం నాస్తి యేన ప్రకారేణాశుభం కర్మ నలిప్యతే కర్మణా నలిప్యత ఇత్యర్థః। అతః శాస్త్రవిహితాని కర్మాణ్యగ్నిహోత్రాదీని కుర్వన్నేవ నలిప్యత ఇత్యర్థః। str... పునరిదమవగమ్యతే। పూర్వేణ మంత్రేణ సంన్యాసినో జ్ఞాననిష్ఠోక్తా। ద్వితీ

యేన తదశక్తస్య కర్మనిష్ఠేత్యుచ్యతే। జ్ఞానకర్మణోర్విరోధం పర్వతవదకంప్యం యథో క్తం న స్మరసికిం। ఇహాప్యుక్తం యో హి జిజీవిషేత్ స కర్మ కుర్వన్ ఈశా వాస్యమిదం సర్వం తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమితిచ। నజీవి తే మరణే వా గృధిం కుర్వీతారణ్యమియాదితిచ పదమ్। తతో నపునరియాదితి సం న్యాసశాసనాత్। ఉభయోః ఫలభేదంచ వక్ష్యతి। ఇమౌ ద్వావేవ పంథానావ నునిష్క్రాంతతరౌ భవతః క్రియాపథశ్చైవ పురస్తాత్ సంన్యాసశ్చోత్తరేణ నివృ త్తిమార్గేణైషణాత్రయస్య త్యాగః తయోః సంన్యాసపథపవాతిరేచయతి। న్యాస ఏవాత్యరేచయదితిచ తైత్తిరీయకే। ద్వావిమావథపంథానౌ యత్ర వేదాః ప్రతి ష్ఠితాః। ప్రవృత్తిలక్షణో ధర్మో నివృత్తిశ్చ విభావితఇత్యాది పుత్రాయ విచార్య నిశ్చితముక్తం వ్యాసేన వేదాచార్యేణ భగవతా విభాగం చానయోర్దర్శయి ష్యామః।

The meaning of the Vedic text is that the knower of the Atma should protect his *self* with the renunciation of the three-fold desires of son &c, and with the devotion to the knowledge of Atma. The Mantra కుర్వన్నేవేహ..., instructs one who, for want of the knowledge of the *self*, is not competent to understand the *self*; కుర్వన్నేవ means only performing; కర్మాణి means works, such as Agnihothra &c; జిజీవిషేత్ means should wish to live; శతంసమాః means a hundred years. It has been declared that it is the longest period of man's life. If one should wish to live a hundred years, then the text enjoins that he should live only doing karma always and not otherwise. If you, as a man, would like to live in this way, there is no other way than the way of performing Agnihothra and other works, by which bad karma may not attach itself to you. Therefore one should wish to live only doing the Agnihotra and other duties enjoined by the sastras. How is it known that this is the sense of the text? By the first Manthra, devotion to knowledge is taught; by the second Manthra devotion to karma is taught to one who is incompetent to cognise the first. Do you not remember it was said that the antagonism between karma and knowledge is firm and unchangeable like a mountain? Here also it is stated that he who would wish to live

should only perform karma, that the universe is covered by the Isvara, that he should save his Atma with the notion of renunciation, that one should covet nobody's wealth. There is a declaration in Sruti that one should not cherish any desire either for life or death and should take to the forest. There is further an injunction about sanyasam that one should not return from thence, the forest life, thus ordaining sanyasam. And also the difference in the results of the two courses will be shown. It is said,

"These two ways only are to be followed; first the road of action; next the road of renunciation. The road of నివృత్తి or cessation from activity, consists in the relinquishment of the three-fold desires; of the two ways, the road of sanyasam is preferable". In the Thithiryopanishad it is said that renunciation alone is pre-eminent (న్యాస). It is decisively said, on due reflection, to his son, by the adorable Vyasa, the instructor of the Vedas, "These then are the two roads on which the Vedas are based, the path which is characterised by action (ప్రవృత్తి) and the path of inaction (నివృత్తి) have been explained, etc.". We shall point out this distinction.

——::o::——

## తాత్పర్యము.

ఆత్మవేత్త యీషణాత్రయమును విడిచిపెట్టి ఆత్మజ్ఞానపరుడై ఆత్మను సంరక్షించుకొనవలెను. ఆత్మజ్ఞానాభావముచేతను ఆత్మవస్తువును గ్రహించుటకసమర్థునకు కుర్వన్నేవేతిమంత్రముపదేశించుచున్నది. శతసంవత్సరములు అగ్నిహోత్రాదికర్మలనుచేయుచునే జీవించుటకు కోరవలెను. పురుషునిపరమాయుర్దాయము శతసంవత్సరములని వేదశ్రుతిచెప్పుచున్నది. నూరుసంవత్సరములుజీవించనిచ్ఛయించినవానివిషయమై యీమంత్రము కర్మలనుచేయుచునే జీవించవలయునని విధించుచున్నది. మనుష్యాభిమానివగునీవు పురుషాయుఃప్రమాణమగు నూరుసంవత్సరములు శాస్త్రవిహితమగు అగ్నిహోత్రాదికర్మలను ఏవిధముగా చేసినయెడల దుష్కర్మలచేత బద్ధుడవుకావో ఆవిధముగా చేయుము. ఈశ్వరార్పణబుద్ధ్యా కర్మచేసినయడల బద్ధుడవుకావు. ఇంతకంటె శుభమార్గములేదు. శాస్త్రవిహిత కర్మలనుచేయుచునే జీవించుటకుకోరవలెనని శ్రుత్యర్థము. పూర్వమంత్రముచేత

సంన్యాసికి జ్ఞాననిష్ఠయు యీమంత్రముచేత తదశక్తునకు కర్మనిష్ఠయు బోధింపబడుచున్నవి. ఈజ్ఞానకర్మవిరోధము పర్వతమువలెనే స్థిరమైనది. ఈయుపనిషత్తుయందుగూడ యీషణత్రయాతీతుడగు సంన్యాసికి త్యాగమున్ను, ధనాభిలాషచ్ఛేదమున్ను జగత్తంతయును ఆత్మరూపమనుభావనయును చెప్పబడినవి. ఆత్మజ్ఞానములేనివానికి అగ్నిహోత్రాదికర్మలు విధింపబడినవి. జీవించుటయందుగాని మరణమందుగాని కోరికలేక అరణ్యవాసమును కోరవలెనని వేదశాస్త్రస్థితియున్నది. నారాయణోపనిషత్తుయందీవిధముగా జెప్పబడినది. „అవలంబనీయములగు రెండుమార్గములున్నవి. ప్రథమమందు కర్మమార్గము. తరువాత సంన్యాసమార్గము. ఈసంన్యాసమార్గమువలన పుత్రాద్యేషణత్రయత్యాగము. ఈ రెండుమార్గములలోను సంన్యాసమార్గము శ్రేష్ఠము." తైత్తిరీయోపనిషత్తుయందును సంన్యాసము శ్రేష్ఠమని చెప్పబడినది. పూజ్యులును వేదాచార్యులునునగు వేదవ్యాసులు చక్కగ నాలోచించి తనపుత్రునకు నీక్రిందరీతిగా చెప్పెను. „వేదములు రెండు మార్గములననుసరించియున్నవి. ప్రవృత్తిలక్షణముగల కర్మమార్గము, నివృత్తిధర్మముగలసంన్యాసమార్గము."

---

*Notes.*

The knowledge of Atma has been taught by the first Mantra. The second Mantra teaches karma to one who is incompetent to know the Atma.

పురుషస్య పరమాయుః :— 'This refers to the Sruti "శతాయుః"

నరె :— In the case of one who connot understand more than that he is a man.

అకంప్యం :— "The antithesis between knowledge and karma is a fact unshakable like a mountain'.

పదం = వేదశాస్త్రస్థితిః.

అరణ్యం :— The word అరణ్య is here used to denote a place free from the company of females. *i. e.*, the stage of సంన్యాసం.

అరణ్యం స్త్రీజనాసంకీర్ణాశ్రమం

నిశ్చితం = with strong conviction.

అసుర్యానామ తే లోకా అంధేన తమసాఽవృతాః।
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కేచాత్మహనో జనాః॥ 3

టీక.

యే కేచ = ఎవరెవరు, ఆత్మహనః = ఆత్మజ్ఞానశూన్యులగుటచేత ఆత్మహంతకులగు, జనాః = జనులున్నారో, తే = అట్టివారు, ప్రేత్య = మరణమునుపొంది, అంధేనతమసా = ఆత్మనుచూచుటకువీలులేని అజ్ఞానచీకటిచేతను, ఆవృతాః = ఆవరింపబడిన, అసుర్యానామ = అసురములను దేవాదిస్థానములగు, తే = ఆప్రసిద్ధమైన, లోకాః = కర్మఫలములను అనుభవించెడి జన్మలను, అభిగచ్ఛంతి = పొందుచున్నారు.

They who are the slayers of Atma, attain, after death, the Lokas known as Asurya and eveloped in the darkness of ignorance.

---::o::---

**Com.** భాష్యం.

---:o:---

అథేదానీం అవిద్వన్నిన్దార్థోయం మంత్రఆరభ్యతే—అసుర్యాః పరమాత్మభావమద్వయమపేక్ష్య దేవాదయోపి అసురాః తేషాంచ స్వభూతాలోకా అసుర్యానామ। నామశబ్దో అనర్థకో నిపాతః। తే లోకాః కర్మఫలాని లోక్యంతే దృశ్యన్తే భుజ్యంతఇతి జన్మాని। అంధేనాదర్శనాత్మకేనాజ్ఞానేన తమసాఽవృతా ఆచ్ఛాదితాస్తాన్ స్థావరాన్తాన్ ప్రేత్యత్యక్త్వేమం దేహం అభిగచ్ఛంతి యథాకర్మయథాశ్రుతం। యే కేచాత్మహనః ఆత్మానం ఘ్నంతీత్యాత్మహనః। కే తే జనాః యే అవిద్వాంసః; కథం తే ఆత్మానం నిత్యం హంతి। అవిద్యాదోషేణ విద్యమానస్యాత్మనః తిరస్కరణాత్। విద్యమానస్యాత్మనో యత్కార్యం ఫలం అజరామరత్వాది సంవేదనలక్షణం తద్ధతస్యేవ తిరోభూతం భవతీతి ప్రాకృతాఽవిద్వాంసో జనా ఆత్మహనఉచ్యంతే తేనహి ఆత్మహనదోషేణ సంసరన్తి తే।

This manthra is commenced for the purpose of condemning the ignorant. The Devas &c, also are Asuras in reference to their becoming one with Paramathma. The Lokas to which they belong, are called Asuryahas. The particle (నామ) is a meaningless word. The word Lokas mean births (జన్మాని), as the fruits of karma are seen or enjoyed there (లోక్యంతే)

అంధేనతమసా means with the darkness of ignorance, which is of the form of inability to see; ఆవృత means covered. The word తాన్ means births ending with the immoveable. (ప్రేత్య) means 'having left this body'. అభిగచ్ఛంతి means 'obtain according to their karma and knowledge'. ఆత్మహనః are those that slay the Atma. Who are those men? Men who are ignorant of the true nature of the *self*. How do they kill the *eternal self*? (They kill) by screening the Atma that ever exists, with the faults of ignorance. The unenlightened man subject to the influence of natural propencities is called the slayer of Atma, because the effect of the existing Atma, which consists of the knowledge of the undecaying and deathless Atma, is obscured as if the Atma were killed; They therefore travel in Samsara, by the fault of the Atma-slaying.

——::o::——

తాత్పర్యము.

ఈమంత్రము అవిద్వాంసనిందార్థము చెప్పబడినది. బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమునుబట్టి దేవతలుకూడ అసురులే. వారికిని బ్రహ్మాత్మైకత్వజ్ఞానములేదు. వారిలోకములు అసుర్యములనబడును. లోకములనగా కర్మఫలములనుభవింపబడు జన్మలు. స్వస్వరూపదర్శనముచేయుటకు వీలులేకుండజేయు అజ్ఞానతిమిరముచేత స్థావరాంత[illegible]కును దేవాదిజన్మలు ఆవరింపబడినవి. మరణానంతరమందు ఆత్మహనుడు స్వకర్మజ్ఞానానుసారముగా నీజన్మలను బొందును. ఆత్మహనుడనగా ఆత్మనుజంపినవాడు. వాడెవడు? ఆత్మజ్ఞానరహితుడు. నిత్యుడగునాత్మనుచంపుట ఎట్లుతటస్థించును. ఆత్మఎల్లప్పుడుండువాడైనను, ఆత్మ శాశ్వతుడు, జీర్ణములేనివాడు, జ్ఞానస్వరూపుడైనను, జ్ఞానము అవిద్యాదోషముచేత కప్పబడినప్పుడు, ఆత్మయున్నను లేనట్టుగానుండి చంపబడినవానితోతుల్యముగానుండును. గనుక ఆత్మజ్ఞానరహితులై,

4

ప్రకృతిలోలుడైయుండువాడు ఆత్మహానుడు. అట్టి ఆత్మహానునకు సంసారప్రవాహములోనవిచ్ఛిన్నముగా మునిగి తేలుటయే ఫలము.

*Notes.*

అసుర్యాః :— సుర means the sun or his light; అసురాః are the beings in whom the darkness of ignorance gives no room for the light of knowledge; even the devas, being within the pale of Samsara are అసురాః. The births of these beings are అసుర్యాః.

Lokas :— Lokas are the births in which the fruits of karma are enjoyed or perceived.

అత్మహనః :— Those who do not know that the eternal Atma is undecaying, immortal, are said to kill the Atma, because they make the existence of Atma as good as non-existence, by casting a shroud of ignorance over the *self*.

ఆత్మ తనలోనున్న దానినెరుంగక పోవుటచేత మనుజుడు ఆత్మహంతకుడగుచున్నాడు.

అంధన = that renders things invisible; the Atma-slayers being tacked on to the wheels of births and deaths, get themselves entangled in the meshes of samsara and being whirled round and round helplessly in the whirlpool of troubles in the shape of death, birth, old age, decay &c., die and are born again and again.

---

అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్ । తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥ 4

టీక.

---

అనేజత్ = (ఆత్మ) చలించనిదియును, ఏకం = అద్వితీయమయినదియును, మనసః = మనస్సుకంటె, జవీయః = వేగముగలదియును, పూర్వమర్షత్ = ముందేవెళ్ళిన, ఏనత్ = ప్రకృతమందు చెప్పియుండెడిఆత్మను, దేవాః = ఇంద్రియములు, నాప్నువన్ = పొందనివాయెను. తత్ = ఆఆత్మ, తిష్ఠత్ = స్వయముగావికారశూన్యమై, ధావతః = పరుగెత్తుచున్న, అన్యాన్ = ఆత్మనిలక్షణమగు

